

# కాళహస్తి శతకము



గుంటూరు జిల్లా వినుకొండ తాలూకా నేట్రాయుని
అప్పాపుర అగ్రహారీకులు
బ్రహ్మశ్రీ చివుకుల సూర్యప్రకాశంగారి
ద్రవ్యసహాయముచే ముద్రింపబడినది.

# శ్రీ కాళహస్తి శతకము

శ్రీజలజాత హైమవతి చిత్తసుధారస పాదదంష్ట్రి యు
గ్రాజగవందను జ్వరహరాన పహాస ధరాధురార్చితా
రాజకిరీట పంచముఖ రంజిత శుభ్రశరీర బంధురాం
భోజభవానుతాంఘ్రి ఫణిభూషణం చంద్రహుతాశ నార్కగో
రాజిత కాళహస్తి మణిగోపుర సాంబశివా మహాప్రభో 1

మూలము విశ్వకర్మకుల భూషణ భద్రయ పుత్రరత్న బా
ణాలన వంశదీపక సనాతన గోత్ర ప్రశస్తభూపతీ
పాలకుడైన వీర శరభేంద్ర కవీంద్రుండు నిత్యకోటిలిం
గాలను బూజజేసి శతకంబు రచించె గ్రహింపవయ్యా నా
పాలిటి కాళహస్తి పరమాత్ముడ సాంబ॥ 2

వడపురి కాళహస్తి విభవంబులు చూడని కన్నులేల సు
స్థిరముగ మిమ్ము నాత్మను వచింపని పాపపు జిహ్వయేలయో
పురహార మిమ్ము బువ్వులను బూజలు చేయని చేతులేల స
ద్గురు కరుణా కటాక్షములు గోరని మానవ జన్మమేల యీ
ధరణిని కాళహస్తి మహరుద్రుడ సాంబ॥ 3

దక్షిణకాశిగంగ యరుదైన సువర్ణముఖీ మహానదిన్
ఇక్షు సుధా రసాబ్ధియని యక్షులు తుంబురు నారదాదులున్
దక్షులెయ్యెరి సిద్ధులు కృతార్థులునైన మహాస్థలంబు పం
చాక్షరి మంత్రపూరిత రసామృత పాత్రుల దివ్యక్షేత్రమో
దక్షిణ కాళహస్తి ధరణీశ్వర సాంబ॥ 4

దక్షిణకాశి ముఖ్యనది దక్షిణస్వర్గము పుణ్యక్షేత్రమై
మోక్షము లేనిదీనులకు మోక్షమిచ్చి తరింపజేయు నీ
దక్షిణ కాశి కేవలము దగ్గరనున్నది చూస్తిమయ్యా ప్ర
త్యక్షము దేవలోకమని యేర్పడ నేటికి మల్లి పుట్టె ఫా
లాక్షుడ కాళహస్తి పరమాత్ముడ సాంబ॥ 5

భూమిని నీ సువర్ణముఖి పుట్టెను రెండవ వారణాసియై
పామర బద్ధపాశభవ పాపవిమోచన పుణ్యక్షేత్రమై
క్షేమమునిచ్చు కర్మముల జెండియవసల గొట్టివేయు నీ
నామ సుధారసామృతము నమ్మితిమమ్మేల బ్రోవవయ్య మా
ప్రేమను కాళహస్తి మహారుద్రుడ సాంబ॥ 6

పురహర కుంజరానన సుపుత్రపవిత్ర పితాపితా మహా
వరద పరంపరాత్పర దివాకర సన్నిభ నాగకుండలా
భరణ శశాంకబింబకళ భాసితవిభ్రమ మేరుతారకా
పురజిత భస్మ లేపన వసుంధర సన్నుత నీవెగాక స
ద్గురుడవు కాళహస్తి పరమేశ్వర సాంబ॥ 7

ధరధర మేరుచాప ప్రమథాధిప రుద్రయుపేంద్ర తాడనా
గరళగళ త్రినేత్ర మణికంకణ శంభు కృశానురేత యో
హరహర శూలపాణి హరిహంస తురంగమ రత్నమాళి ని
ర్జరనుత మూలబాహ దనుజాంతక శాంభవిచిత్తచోర శ్రీ
పురహర కాళహస్తి త్రిపురాంతక సాంబ॥ 8

కలగని మేలుకొన్నగతి గారవమాయె బ్రపంచకంబులో
గలసి సమస్త భాగ్యములుగల్గిన నేమి ఫలంబు సంపద
ల్నిలువవు దేహమోహములు నీరుమలంబుల మట్టిగుంటలో
మొలచిన నీరుబుగ్గయిది మోసముచేయును నమ్మరాదు
నిశ్చలముగ కాళహస్తి నిటలాక్షుడ సాంబ॥ 9

కాశి పురీశగర్భ నవఖండ ధరిత్రి పతిత్వమబ్బి నా
యాశకుమట్టులేదు కనకాద్రి సమాన ధనంబుగల్గినా
లేశము వెంటరాదు మదికింపుగ జేసిన పుణ్యపాపముల్
ద్రోచినబోదు నీ కరుణతోయజము ల్వికసించి నంతటన్
బాయును కాళహస్తి కరకంఠుడ సాంబ॥ 10

నిల్వవు ఎట్టికాయములు నిల్వవుగోవులు మాయసంపద
ల్నిల్వవు భోగభాగ్యములు నిల్వవు సొమ్ములు నిండ్లుమేడలు
నిల్వవు దేహపోషణలు నిల్వవు కష్టసుఖాలయంశలున్
నిల్వవు మోహపాశములు నిల్వవువాంచలు పాడిపంటలున్
నిల్వవు కాళహస్తి నిటలాక్షుడ సాంబ॥ 11

తావకపుత్రదార తలిదండ్రులు నన్నలు తమ్ములున్ జెలు
ల్బావలు చుట్టముల్ సఖులు బంధువులెవ్వరు వెంటరారుయీ
జీవము కాస్తపోతె మఱి జేరరుదగ్గర నెంతప్రాణ సం
జీవప్రియాప్తులైన గరుణింపరు శీఘ్రమ పట్టమందురో
దేవుడ కాళహస్తి జగదీశ్వర సాంబ॥ 12

ప్రాణికి బొందికేమి ప్రతిబాధ్యత యెప్పుడో యేక్షణానో
ప్రాణము భంగపెట్టి సుతపత్ని ప్రియాళుల దుఃఖపెట్టి యీ
ప్రాణము దల్లడించి తనబాటను యెక్కడ నేస్థలాననో
ప్రాణము వెళ్ళిపోతె తన బాధ్యత లంతట దీరిపోవునా
ప్రాణికి కాళహస్తి పరమాత్ముడ సాంబ॥ 13

ప్రాణములుండగానె నిను బ్రార్థనచేసి నటింపరాదో
యీ ప్రాణము లున్నమట్టుకు నిబంధన యున్నదో యంత
మట్టుకే ప్రాణము నిల్వదాకడను బాధ్యత దీరిన నంత నేల నీ
ప్రాణము లేనిబొంది నిను బ్రార్థనజేసిన మళ్ళివచ్చునా
ప్రాణము కాళహస్తి పరమాత్ముడ సాంబ॥ 14

ప్రాణము బొందిలోనిలిచి పాపపుణ్యము రెండుచేసి యా
ప్రాణము లేచిపోయి యమ బాధనుజెందితె బొందిపోయి యా
ప్రాణిసహాయమకాన భవబంధ ఋణాదులు దీరెనంటె యా
ప్రాణము లేచిరాదు యుపకార మదొక్కటి వచ్చుదోడుగా
ప్రాణికి కాళహస్తి పరమాత్ముడ సాంబ॥ 15

ఎట్టిఘటంబు లుండినను యెందుకు నెక్కడ నేస్థళానవో
పుట్టినచోటనో బ్రతుక బోయినచోటనొ యున్నచోటనో
గుట్టనొ త్రోవనో గుహానొ గుంటనో చావునిజంబు బొందికిన్
గట్టిగ కాళహస్తి గణనాయక సాంబ॥ 16

పుట్టుక యేడనో సకల భూముల త్రొక్కి చరించు టేడనో
పట్టణమేడనో యుదక పానము యేడనో మట్టియేడనో
గిట్టడమేడనో మఱి సుఖించుట యేడనో యుండుటేడనో
గట్టిగ నీవెరుంగుదువు గాక యితర్లకుజెంది చిక్కునా
వట్టిది కాళహస్తి పతిరుద్రుడ సాంబ॥ 17

ఎన్ని మహాస్థలంబులని యెక్కడ చూడనుజూచునే
భవధ్యానముసేయ కెన్నటికి దైవము నెక్కడతాను వేద సం
పన్న గుణాఢ్యుడై తన తపస్సు ఫలించితె యున్నచోటనే
యున్నది మోహనామృతము నూరకభూమి జరింపగానె యే
మున్నది కాళహస్తి మునివందిత సాంబ॥ 18

పేరుకు నన్ని యాత్రలు ఫలించిన తా ఘన పుణ్యుడాయెనా
కారముమానెనా సకల కర్మనివారణ సిద్ధుడాయెనా
యూరకపోయి రావడము ఒక్కటెనెందు సమస్త యాత్రలు
దీరిన దీరకున్న గురుతీర్థ ప్రసాద ధురీణుడాయెనా
శూరుడ కాళహస్తి శివశోభన సాంబ॥ 19

ఇత్తడి హేయమౌనె నది యెన్ని పుటంబులు వేసిచూచినా
యిత్తడి యిత్తడేను నిది యెక్కువ సొమ్ముకు నష్టిచేసునా
యిత్తడి పైడియౌన నిది యన్య మెరుంగక నన్య వేల్పులన్
సత్తుగ పూజచేసినను సద్గురుపాదము నమ్మకుండినా
వుత్తర కాళహస్తి వృషభేశ్వర సాంబ॥ 20

జీవుడు జీవుడంచును భజించిన నాత్మకు నాత్మ దేవుడే
జీవుడ జీవుడే గురుడు జీవుడు దేవుడు దేవదేవ నీ
త్రోవను నీవుపోతె పెడత్రోవకు బొందికియాత్మ గల్గు ని
ర్జీవ ఘటంబు శీఘ్రముగ చేరువగాబడి రుద్రభూమికిన్
జీవము కాళహస్తి గిరిజాపతి సాంబ॥ 21

జీవుడు వచ్చిపొయ్యె క్రియచిక్కక నియ్యెక చచ్చిపుట్టి నీ
లాగున నిట్టి జన్మములు లక్షలుకోట్లన యిందునంద నా
దేవుడ యేమి సార్థకము మానసమందున నిన్ను నమ్మితే
కేవలమున్న మోక్షపురి కెత్తుకపోయి తరింపజేతువో
ధీరుడ కాళహస్తి జగదీశ్వర సాంబ॥ 22

ఏమిఘటంబు యేమిబ్రతుకేమి శరీరము యేమి మోహముల్
యేమి సుఖంబు యేమి యిది యెన్నటికైనను జావుసిద్ధ మీ
భూమిని యిట్టి జన్మములు పుట్టిన గిట్టిన మోక్షమేమి నా
స్వామి కథా సుధామృత రసజ్ఞతజెందిన ముక్తిగల్గునే
ధీరుడ కాళహస్తి జగదీశ్వర సాంబ॥ 23

ఎక్కడి చుట్టపక్కము లదెక్కడి పుత్రులు తల్లి దండ్రులున్
యెక్కడిసంతపట్టు నదియెక్కడనైన ఫలించి యుండెనా
యెక్కడి దేశదేశములు నండజముల్జత ప్రొద్దుగ్రుంకితే
నెక్కడిపక్షులక్కడనె యెవ్వరిబాటలు వారివారికే
నిక్కము కాళహస్తి నిటాలాక్షుడ సాంబ॥ 24

పులివలె యీ ఘటంబు పడిపోయినపిమ్మట గాలిగాలిలో
పలను ఋణాను బంధ ప్రతిబాధ్యత నున్న కళేబరంబులో
నిలుచు నటన్న స్వగృహము నీడనుబాసిన చీకటింటిలో
నిలిచిన హంసకై పడిని నీవు యెఱుంగని మాయయున్నదా
వెలుపల కాళహస్తి యజవందిత సాంబ॥ 25

మనుజుల నీదిగర్భ కసుమాలపు డొక్కలయందు మళ్ళి హా
నను బడద్రోయవద్దు యొకనాటికినైన మహాత్మయీ పున
ర్జననముచాలు సద్గతికి జేర్చర యీశ్వర యేదివేళ నే
నిను నెడబాయకుందు ధరణీశ్వరయంచును మ్రొక్కుచుందునా
మనసున కాళహస్తి మహారుద్రుడ సాంబ॥ 26

ముట్టునబుట్టి రక్తమలమూత్రిము లందున దోషకారి నే
పుట్టిన యెన్నిజన్మములు భూమిని మల్లి యనేకచోట్ల నే
బుట్టితె నేమికద్దు నరపుట్టుక నాకికవద్దునన్ను యా
పట్టునిల్పి మోక్షక్రియ మార్గముజూపి తరింపనీయరా
గట్టిగ కాళహస్తి గణనాయక సాంబ॥ 27

పిడికిట పుష్యరాగ మణిబెట్టుక వ్యర్థులు రాళ్ళకోసమై
యడవి జరింపనేల మిము నాత్మనుగానక సంతజోగులై
పుడమి చరింపనేల శివపూజ క్రమంబులు మాననేల నా
కడపటపోర్ల నేల నుదకంబులు లేక నశింపనేల యా
గడములు కాళహస్తి యజవందిత సాంబ॥ 28

కాశికిబోవనేల నుదకంబులు మోసుకరాగనేల నా
కాశి మహాప్రవాహజల కాలువలై ప్రవహించుతోయ మా
కాశజలంబుగాదె శివకాశిభవుండవు నీవెగావ యా
కాశికిబోవగా సకలకర్మము లెడబాసిపోనె భూ
తేశుడ కాళహస్తి భువనేశ్వర సాంబ॥ 29

బట్టలుపిండికట్టుకొని భక్తిగసంధ్యల నెంతవార్చినం
బట్టెడు చేతిలోన నొక భక్తునికైన నతీంభిక్షమున్
బెట్టకముక్తి లేదుమును నేమియునైనను బెట్టిపుట్టితే
పుట్టికి నూరుపుట్లు శివపూజలు నూటికి కోటివేలు నీ
దిట్టము కాళహస్తి భువనేశ్వర సాంబ॥ 30
తెలివిగ నున్ననాడె యుపదేశము నొంది శివాశివాయనే
పలుకులు సంగ్రహించుకొని భావమునందున ముక్తికాంత
తో గలసి సుఖింపలేక నరకంబున పాపము కల్మషంబులో
బలిమిగ దూరిపోయి యమబాధల కోర్చిరి కష్టజీవులై
సలలిత కాళహస్తి బుధశంకర సాంబ॥ 31
హాపరమాత్మ నీదు చతురక్షరి ప్రాణ ప్రతిష్టమంత్ర ని
క్షేపము మాకుగావలయు కేవలమైన సదాశివాయనే
యాపద బాంధవుండ త్రిపురాంతకరుద్రుడ నీదుకీర్తనల్
పాపవిమోచ నంబులని ప్రార్ధనజేసెద పాదపద్మముల్
చూపుమి కాళహస్తి సురసేవిత సాంబ॥ 32
గాయక రావణాసురుని కన్నబలాఢ్యులు లేరుభూమిలో
మాయలయందు సర్వఘనమంత్ర ములందున ధైర్యమందు
ప్రాయమునందునన్ బలపరాక్రమమందున భక్తియందునన్
గాయము నందుగా తుదకు గాలముసెల్లిన యంతనే హాతుం
డాయెను కాళహస్తి యమరార్చిత సాంబ॥ 33
నీమము బట్టి రావణుడు నిత్యము భోజనశాలయందు హా
కోమల సన్నుతాంఘ్రి నవకోటివిరుల్మరి బూజచేసి ర
త్నామణియేమి మోక్ష సిరిసంపదనొంది తరించెపైగ శ్రీ
రాములచేతజచ్చె త్రిపురాంతక చూడుమి భక్తిలేక యీ
భూమిని కాళహస్తి భువనేశ్వర సాంబ॥ 34

జలధర లోకరక్షకుడ సర్వము రుద్రమయం జగత్తుగా
బలికిన వేదశాస్త్రముల పాడజెలంగి మదాంధులై మహా
త్ములు పతనంబుచేత శివదూషణచేసి యనేక యేండ్లు బా
ధలపడి నోరుపుచ్చి సిరిదప్పి యఘోరవు దుఃఖజీవులై
నిలచిరి కాళహస్తి నిటలాక్షుడ సాంబ॥ 35
జలధరనీపుమాకు సిరిసంపదలిచ్చిన మేలువార్తగా
కలగని మేలుకొన్న యటుగాక మహేశ్వర యేదివేళ నీ
కొలువుననుండి యన్యులను గోరి వచింపను నోరురాదయా
లలిత ఫణీంద్రనారి నిటలాక్ష సదాశివ శంభు మూర్తికే
వలయును కాళహస్తి కరకంఠుడ సాంబ॥ 36
హీనులవెన్ని విద్యలుగ్రహించిన యప్పటి పొట్టకూటికే
గానితరింపులేద యధికారమునందున ముక్తి యున్నదే
వీనికి ముక్తికాంత స్థలమెక్కడిదో యుని కేడనో మహా
జ్ఞానచరాచరంబుల మహాత్ముడ నిన్మది చాల నెప్పుడున్
గానరు కాళహస్తి కరకంఠుడు సాంబ॥ 37
హీనవుజాతి దుర్గుణుల కెన్ని విధంబుల బోధచేసిన
న్వానియసద్గుణంబుల నివారణ మొందునె భోగివాసుకీ
కూనకుపాలు తేనె దధి గుజ్జురసంబుల నెంత బోసినం
దానివిషంబుబోనె మృతిదప్పునె క్రూరము మానునేకనన్
మానదు కాళహస్తి బుధమాన్యుడ సాంబ॥ 38
నిండు సమస్త లోకముల నీల సుకంధర రుద్రమూర్తికిన్
రెండవసాటి వేల్పు లిక లేరనివాకిట గంటకట్టి వే
దండము నెక్కియంతటను దంధణధంధణ భేరివేసి బ్ర
హ్మాండము దండనిండుకొని యద్భుతమైన మహాస్వరూపుడై
యుండవె కాళహస్తి త్రిదశోన్నత సాంబ॥ 39

విపులరథంబు హేమగిరి విల్లుసురేంద్రుడు కాండమర్క ఋ
క్షపతులు బండికట్లు విధిసారథి శేషుడు నారి వేదముల్
నృపుడగుఱాలు జేసికొని నృత్యము ద్రొక్కుచు తోలి నేర్పుగా
త్రిపురసురారి గూల్చితివి ధీరత నెవ్వరు నీకుమించిరో
కృపగల కాళహస్తి దివిజేశుడ సాంబ॥ 40

నరసుర వంద్యుడీశ్వరుడు నాయకు డొక్కడెగాని వేరితః
పరము లెఱుంగ మందక విపక్ష యటంచు సహస్రశీరుషా
పురుష యటంచు దేవతలు పూజ యొనర్చి తరించినారు నా
తరమె భవత్స్వరూపముల త్రాణ యెరింగినుతింపనాత్మ సు
స్థిరముగ కాళహస్తి సురసేవిత సాంబ॥ 41

ఒక్కడె లోకరక్షకుడు నొక్కడెదైవము యెందుజూచినన్
మిక్కుటమైన రూపమున మింటికి మంటికి సూత్రధారుడై
తక్కి సమస్త లోకముల దాండవ మాడుచునున్నవాడు తాం
నొక్కడెగాక యీశ్వరుడుయొక్క నిమించియితః పరుండుయిం
కెక్కడ కాళహస్తి గిరిజేశ్వర సాంబ॥ 42

తత్తర నన్నుగన్న తలిదండ్రులు యెత్తుక ముద్దులాడి నీ
పొత్తునడించి యీశ్వరుడు పోషణ జేయునటంచు గట్టిగా
దత్తము చేసినారు గురుదైవము నిద్దరు నాకునీవే సా
తూత్తు నిజస్వరూపమును గన్నుల జూపుము కాంక్షదీర సం
రక్షక కాళహస్తి బుధరంజిత సాంబ॥ 43

కొడుకులు లేక లేక యొక కోకిలవాణి సుపుత్రు మారుగా
నుడుతనుదెచ్చి పెంచుకొని యుగ్రుని పేరిడిపిల్చి రార వో
కొడుకని ముద్దులాడగను గొమ్మకు నప్పుడు గర్భచిహ్నలై
కడుపుధరించె సంపదలు కన్నులజూపె సమస్త కర్మముల్
విడిచెను కాళహస్తి వృషభేశ్వర సాంబ॥ 44

స్థిరముగ నీదు దర్శనము జేసిననాడె యనేక పాపముల్
పరిహారమాయె కర్మములుబోసె దొలంగె దరిద్రదుఃఖముల్
దరికొని కాలసాగె రజతాద్రికనుంగొన ద్రోవచిక్కెనో
పరమశివుండ మోక్షమను పర్వత మెక్కితినయ్య యోహరా
హరహర కాళహస్తి హరివందిత సాంబ॥ 45

పొదలెడి నాదరిద్రములు బోయెను మిమ్ముల జూడగా సహా
కుదిరెను నామనస్సు వృషఘోటక భీష్మ భవాంధకారముల్
వదలెను నేటితోను ఘనవాంఛను వచ్చిన కాలకింకరుల్
యొదిగిరి మూలమూల నిక నూరక శంభుని నామకీర్తనల్
చదివెద కాళహస్తి త్రిపురాంతక సాంబ॥ 46

కమలపు పాలికిన్ హరికి గట్టిగ స్నేహమటంచు నందురా
కమలము లేడనైన నుదకంబులు లేని స్థలంబునందు నా
కమల నభోగ్ర తిగ్మకర కాంతులకున్మరి తాళరాదె యా
కమలము వాడిపోక నుదకంబులు పాసిన చావదా భవ
త్కమలము కాళహస్తి కరకంఠుడ సాంబ॥ 47

ముప్పున కాలకింకరులు ముంగిట జేరుక కాలపాశముల్
తెప్పునగట్టి ప్రాణములు తీసెడువేళల మాయచీకటిన్
గప్పిననాడు మీస్మరణకల్గునొ కల్గదొ యందుకిప్పుడే
తప్పగ నేతు మీస్మరణ త్ర్యంబక నేను తరించుకోసమే
యప్పని కాళహస్తి నిటలాక్షుడ సాంబ 48

నెరయ దరిద్రదోషమున నిత్యము జానెడు పొట్టకోసమై
నరులనుతించి మానుషముదప్పి యసత్యములాడ లేక నీ
మరుగున జేరి రిక్తులము మమ్ముల బ్రోవుటంచు మ్రొక్కినన్
గరుగదు నీమనంబు శితికంధర యింతపరాక దేలరా
యెఱిగియు కాళహస్తి వృషభేశ్వర సాంబ॥ 49

నెత్తిన గంగయుండ శిఖినేత్రమునం దనలుండునుండ నీ
పొత్తున ధాన్యముండ మఱి యెత్తుగ జేతను పాత్రముండ నీ
పొత్తున గూడు వండుకొని భోగ్యముగా భుజియింపరాదె యీ
పిత్తమదేమి జోగివలె భిక్షుకు బోవగనేమి వట్టిదే
దిత్తము కాళహస్తి నుతదిక్పతి సాంబ॥ 50

తాండవలింగ నీసతి వితండము లేమి యనాణలోభీ పా
షండుల కీవు భాగ్యయుత సంపదలిత్తువు సత్యసద్గుణో
దండ నిధాన మంత్ర జపతత్త్వ ప్రసంగ తపః ప్రభూత స
త్పండితులైన వారికి విపత్తుల నిత్తువదేమి వారి కా
దండన కాళహస్తి పురధారణ సాంబ॥ 51

బారుగనాటలాడి శివభక్తులతో సరియైననీకు శృం
గారము లేల దారువన కాంతలు నేలి భవాని యేల భా
గీరధి యేల సర్పభుజకీర్తులు నెల్ల ధరించుకొన్న వె
వ్వేరులయొక్క ముద్దుమురిపెంబుల నెవ్వర జూడనయ్య మీ
వారిలో కాళహస్తి సురవందిత సాంబ॥ 52

పన్నగభూష నీవు చెయిబట్టిన చాపము పైడికొండ నీ
వున్నది వెండికొండ తలుపున్నతమంత హిరణ్యానీవు నీ
కన్న ధనాఢ్యులెవ్వరికి గల్గుదురే పగలెంచి చూచినన్
దిన్నగ బిక్షమెత్తుకొన దీనుడవా దరిలేనివాడవా
యెన్నగ కాళహస్తి వృషభేశ్వర సాంబ॥ 53

ప్రేమతో నీవుగన్న యొక బిడ్డడు గుజ్జయి కూటికేడ్చెనా
వామ ప్రియాత్మజుండిక వివాహము లేక తపించుచుండ నీ
ధామసుతుండు పైకినొకదుప్పటి నిమ్మని యంగలార్చె నీ
కేమిపరాకొ పుత్రులకు నియ్యని వాడవు మాకునిత్తువే
భూమిని కాళహస్తి ఫణిభూషణ సాంబ॥ 54

భీమమహేశ్వరా చిలువపేరులు నీవె ధరించు కొందు నీ
భామకు రాగిసొమ్ములు నపారముగా ధరియించినావు చి
న్నామెకు జీరనివ్వకయనాథనుగా నొగిజేసినావు నీ
కేమి దరిద్రమొందె నపకీర్తి యెఱుంగక చేసితిట్లు లీ
భూమిని కాళహస్తి సురపూజిత సాంబ॥ 55

కరివరదాంఘ్రిజా నగహితాత్మజ దారువ నాంగనామణీ
తరుణులబాసి యుగ్రజప తర్పణ హోమమెనిల్పిప్రోడ చా
తురిమముమించి యీడగువ ధూమణితో జని కల్లుకుండలో
జొరబడి పూపిరాడక యుసూరని నీవు తపించి తంతగా
విరహామ టయ్యకంచి పృథివీశ్వర సాంబ॥ 56

వందిత నన్నుతాంఘ్రి యొకభక్తుడు పుత్రునిజంపి కూరగా
వండి భుజింపజేసె మఱియొక్క మహాత్ముడు నీకు భృత్యుడై
యుండికళత్రమిచ్చె ననువారగజూచి మరొక్కభక్తుడున్
మెండుగ రాళ్ళురువ్వె పరమేశ్వర భక్తులజాడయెంత యు
ద్దండమొ కాళహస్తి యజవందిత సాంబ॥ 57

శోభాసుర పంచవక్త్ర యొక భక్తుడు యెంగిలిపండ్లు గిన్నెలో
తీసుకవచ్చి పెట్టినను దిగ్గునలేచి భుజించి మెచ్చి కైలా
సము నిచ్చినావు కరకంఠుడ నీ భ్రమ యేమిచెప్పనో
వాసవ పూజితాంఘ్రీ మునివందిత మమ్ముల బ్రోవవయ్యా నీ
దాసుడ కాళహస్తి నిటలాక్షుడ సాంబ॥ 58

మానక బోయెడెన్నడు సమస్తమృగంబులజంపి దొన్నెలో
మాంసము దెచ్చిపెట్టి తినుమంటె భుజిస్తివి యెగ్గులేక నీ
తాపమదేమొ నీవుయిక దగ్గఱరాకు మటంచు పార్వతీ
హింసల నిన్ను బెట్టిన సహిస్తివి యప్పుడు శాంతమూర్తివై
పురహర కాళహస్తి త్రిపురాంతక సాంబ॥ 59

అతులిత కాలకూట విషమప్పుడు ముప్పదిమూడుకోట్ల దే
వతలు ననేక బాధపడి వచ్చి భయంబుననోహో పార్వతీనోహో
పతియని నీవు దిక్కుయని పక్షులవోలెను తల్లడించుచుం
గతిచెడివస్తె యందరిని గాచి విషంబు హరించినావు స
మ్మతముగ కాళహస్తి సురవందిత సాంబ॥ 60

గరళము మ్రింగి కంఠముననిల్పి హరించి జయించి మాయగా
సురతనునీవు మూర్ఛగొని మ్రక్కిన నా పదమూడు జాములున్
సురముని భూతసిద్ధయతి సూర్యసుధాంబు వుపేంద్రయింద్ర
గంధర్వులు భక్తిచేత దమ దాపునచేరుక సేవజేయుచున్
దిరిగిరి కాళహస్తి త్రిపురాంతక సాంబ॥ 61

అరమర లేక నేను శివరాత్రి మహోత్సవ కాలమందు జా
గరణముచేసి గొప్పగ నఖండము బెట్టుక మేలుకొంటి హో
మరి పదమూడుజాములూను మానుల మంచును నిద్రహార మే
మరక తదేక ధ్యానమున మర్వక మిమ్ము భుజింపజేయుమీ
సిరిగిరి కాళహస్తి త్రిపురాంతక సాంబ॥ 62

దుర్గుణ యోగశిక్షసుర ధూర్జటిదుందుభి దుందుభీసుతా
భర్గభవా భవాంతిక ప్రభాకరవర్ణ యపర్ణ పార్వతీ
దుర్గమృఢాని చండిక వధూమణి మానసపద్మ బంభరా
భార్గవ శిష్యవర్గహత భార్గవ సాంబ॥ 63

వాదుకుబోక మాకు భగవంతుడె దిక్కుగదా యటంచు మీ
పాదము నమ్ముకొన్న శివభక్తుల కేమి వ్రతంబు లంచు నే
కాదనులంచు నోరువడి గట్టుకయుండి నశింపనేల యీ
బాధలుయేల వట్టియుదకంబులు పిండి భుజింపనేల నా
వేదన కాళహస్తి విటలాక్షుడ సాంబ॥ 64

నీవె సమస్తరూప ధరణీశ్వర మండల జ్యోతిరూపము
న్నీవె జగద్గురు ప్రముఖ నిత్యమహోత్సవ శక్తిరూపమునే
నీవె పరంపరాత్పరిముఖ నిగ్రహావిగ్రహ మంత్రరూపమున్నీ
వై జయంజయా సుగుణ నిర్గతచారుమహా స్వరూపము
న్నీవెగదా ననున్ మనుప నిక్కము సాంబ॥ 65

నందితురంగ సుందర పినాకప్రియాంబక ప్రష్ట సారథీ
నందసుతాగ్ని భక్తశరణాగతపోష నమశ్శివాయ యో
సుందరమూర్తి ఖండపరశూ రజతాద్రిపతీ ధనంజయా
వందిత నాగభూషణ భవానికళత్ర సుభక్తసంగమా
నందక కాళహస్తి యతివందిత సాంబ॥ 66

దేవమహానుభావ జగదీశ్వర ధూర్జటి యీశ్వరా మహా
దేవ హరా మృఢాని జపదేవత భర్గఫణీంద్ర హార హా
రావళి నీల లోహిత పురాజిత బ్రహ్మకపాలహస్త యో
పావనమూర్తి సద్గురుడ పాలితమౌని సురేంద్ర మోక్ష బృం
దావన కాళహస్తి భువనేశ్వర సాంబ॥ 67

అంగజవైరి భక్తహృదయాంబుజభృంగ కురంగపాణి శు
భ్రాంగజిగంగలింగ భవభంగ ప్రసంగ దయాంతరంగ మా
తంగ భుజంగ పుంగ వసితాంగ లతాంగస ముక్తి కామ
భస్మాంగ విభూషితాంగ వృషసంగ కృపాతిమిరాంగభంగ స
ర్వాంగమ కాళహస్తి వృషభేశ్వర సాంబ॥ 68

భూతపతీ కపాల భృతభా వృతపక్ష సరోరుహాంఘ్రి సం
భూత సుతాగ్ని కేశవ సుపూజ మహత్వము భక్తవత్సలా
మాతపితా సహోదరులు మాకిక నెవ్వరు మీకుమించి యో
శ్వేతకళత్ర పూర్ణ శశిరేఖర యిక్కడ మాకునీవే సం
ఘాతము కాళహస్తి వృషభేశ్వర సాంబ॥ 69

పరశివ యాదిబ్రహ్మ వృషభధ్వజ మద్గురు షణ్ముఖాపితా
సురగురు వ్యోమకేశ వరసుందర యీశ్వర యప్రమేయయో
కరివరదా సుతాంఘ్రి శితికంఠ గిరీశ మహేశ్వరా జరా
సురహర ఖడ్గపాణి జయశూలిభవాని శివాపితామహా
పురహర కాళహస్తి త్రిపురాంతక సాంబ॥ 70
పరమరహస్య మంత్రక్రియ భాసుర పక్వఫలా మృతామృతా
దరరుచిగొన్న భక్తగణ దీక్ష మహాత్ముల పాదధూళి మా
శిరమునబారి యెన్నటికి సిద్ధులమౌదుము గాక మేము నీ
మరుగున జేరినాము నభిమానమునుంచి తరింప జేయవే
గురుతుగ కాళహస్తి గిరిజాధిప సాంబ॥ 71
మాతృపితానుతాంఘ్రి శివమంత్రమునోట పఠించకున్న యా
నోరు వృథానిరర్థకము నో రసరాదది పాడుబొంద ఓం
కారమహత్వ భక్త సిరికాంచన బ్రహ్మ కపాలహస్త ఓం
కార విభూతిదాయ కసుకంథర గంధశరీర దేహం కం
కీరవ కాళహస్తి కరకంతుడ సాంబ॥ 72
మానవజన్మమెత్తి శివమంత్రల సద్గతిముక్తి సత్క్రియా
హీనుడ నెన్ని విద్యలు గ్రహించిన నేమి ఫలంబు యీశ్వరా
ధ్యానముచేసి మోక్షమును గన్గొన కెప్పుడు సంచరించు నే
మానవుడైనగాని శివమందిరమందు నటింప నేర్చునా
మానవ కాళహస్తి మహారుద్రుడ సాంబ॥ 73
వాసవ పూజితాంఘ్రి మునివందిత దేవపరాకు యీశ్వరా
భాసుర కృత్తివాస విరుపాక్ష మృగాంక మృగాంక శోభితా
వాసుకినాథ భక్తగణవత్సల చారుత్రిమూర్తి మూల సిం
హాసన జ్యోతిరూప వరహంస విరాగ్గురు దక్షిణానికై
లాసము కాళహస్తి కరకంతుడ సాంబ॥ 74

నెరనినునమ్మి కొల్చునరు నేత్ర సరోరుహ పూజితాంఘ్రి నే
నిరతము మంత్రపుష్పముల నెటను రేపట సన్నుతింతుగా
గురుతుగ పూజచేసి యమద్వారము గట్టిగ పాడుచేతుగా
బిరుదుశరాయచూడు వృషభేశ్వర భూరిజటాకలాప యో
పురహర కాళహస్తి త్రిపురాంతక సాంబ॥ 75
పురహర తొల్లి విష్ణువును జూడరె నేత్రసరోరుహంబుతో
మురియుచు పూజచేసిమది మోక్షములంది తరించి యెప్పుడున్
మరిమరి నోరుక్రొవ్వి శివమంత్రము నోట బఠించకున్న యీ
నరులకు యేమొకాని వరనందన సత్కళ కాంతిలేక నే
జరిగిరి కాళహస్తి జగదీశ్వర సాంబ॥ 76
రక్తకళత్ర యీశ్వరుడ రాజితనామ సురేంద్ర వైభవా
భక్తులుతొల్లి ఇక్కడ తరించెద మంచునువచ్చి యాత్మలో
సక్తముచేతనిన్ను గనినప్పుడె సుస్థిరపూాల జీవులై
భక్తిఫలించె నింద్రుని యుపాస్తి బలంబున ధన్యులైరి నీ
భక్తులు కాళహస్తి భువనేశ్వర సాంబ॥ 77
నీరజటాకలాప పరమేశ్వర నిన్ను నుతింప దేవ బృం
దారకులై నజాలరు యథాస్థితిగా నినుగాంచి నిన్నుకై వారము
చేసి సద్గురుడ వర్ణనసేయను నాతరంబె యో
మేరువశాజ్గన్ పాణి పరమేశ్వర పూరితధర్మ సత్యసం
చారణ కాళహస్తి పరమేశ్వర సాంబ॥ 78
శరణని నిన్ను వేడితిని చక్కనితండ్రి పతితపావనా
బిరుదులుగట్టినావు యిట పేరువహించి తరింపజేసి నా
పరమ సుఖంబు భక్తులకు పాపటబొట్టు కిరీటరత్న మీ
పురము సమస్తజీవులకు పుణ్యము లిత్తువటంచు వస్తి మీ
మరుగుకు కాళహస్తి మహారుద్రుడ సాంబ॥ 79

ధాత్రి సమస్త భక్తులు కృతార్థులునైన మహాస్థలంబు యీ
క్షేత్రప్రయాగదిపఋషిసిద్ధులు పుట్టినజన్మభూమి మీ
క్షేత్రముదివ్య క్షేత్రమని చాలప్రసిద్ధము నమ్మి యీ మహా
క్షేత్రము కాళహస్తి శితికంఠుడ సాంబ॥ 80

గోత్రశత్రు మిత్ర మద నోధ్వజ గాత్ర శరీరదాన గో
పాత్ర ప్రతిష్ట ప్రాణపరిపాలక సద్గుణ దేవరత్న గా
యత్రి నుతాంఘ్రి భక్తులకు యేమిప్రధానము కేవలం శివ
స్తోత్రము జీవనౌషధము జిహ్వాకుకర్మ విమోచనంబు యీ
క్షేత్రము కాళహస్తి శశిశేఖర సాంబ॥ 81

హాసుర హాగజాసురుని హామికనిల్వ ధరింప లేక హా
నీసరి సాటి దేవతలు నిన్ను భజించుచువచ్చి మీపై
మీసము లేదు మాకు పరమేశ్వర మమ్మేల ప్రోవవయ్య మీ
దాసులమంచు మ్రొక్కిన ప్రతాపము చాలునుమాకు శ్రీగిరీ
వాసుడ కాళహస్తి మహారుద్రుడ సాంబ॥ 82

పరమసఖుండ భక్తశశంఖ దుద్రదజ నుగ్రహా జాగ్రతస్థళా
దౌరకదు యింతయింతకన్నను చతుర్దశలోకము లెంచిచూడ నీ
కరుణ కటాక్షవీక్షణము గట్టిగ నుంచుమి నమ్మినాను శ్రీ
ధరసుత కాళహస్తి జగదీశ్వరా సాంబ॥ 83

మన్మథవైరి మాకు పరమామృత పానము సేయకున్న నా
జన్మమదేల-సద్గురుని చెంతను జేరి తదేకనిష్ఠతో
చిన్మయలింగమంత్రము ప్రసిద్ధిగ నోట పఠించితే పున
ర్జన్మము లేదు భక్తులకు క్షేమము యింద్రుని సన్నిధానమే
జన్మము కాళహస్తి జగదీశ్వర సాంబ॥ 84

హరహర యిష్టలింగ దరహాసముఖాబ్జ నమోనమో పురం
దరనుత కాలకంధర కృతార్థుల శేయుమటంచు నాత్మలో
సిరిగల వావుదేవుని భజింపని పాపవిదుష్టులైన యా
నరులను ఘోరమైన యమదండన బెట్టిరి చూడవయ్యా యో
పురహర కాళహస్తి త్రిపురాంతక సాంబ॥ 85

పుడమిని భక్తిగల్గి శివపూజ సుధామృత పూర్ణ సద్భుదా
ముడివిడగోసి లోపలను మూలవిరాట్టుని మోక్షకన్యకా
కుడిభుజమెక్కి తాండవము గుల్కకగాని యనేకపాపముల్
విడుదలగావు కర్మములు వీడవు యెంతటివారికైన రు
ద్రుడవిను కాళహస్తి త్రిపురాంతక సాంబ॥ 86

ఎఱుగక చేసి పాపముల నెంత తపించిన వ్యర్థపోవునా
వర యమధర్మరాజు పరిపాలననాటికి వచ్చునా మహా
గురవ మధాంధకారమున గానక చేసిన పుణ్యపాపముల్
తరుముక వచ్చు వెంటబడి తప్పక యెక్కడ దాగియున్ననో
పురహర కాళహస్తి త్రిపురాంతక సాంబ॥ 87

ఇక్షుసుధాంఘ్రి యీశ్వరుడ యెన్నడు మిమ్ముల జూతుమయ్య
ప్రత్యక్షము చేసికోవలసి దప్పున మానసపూజచేత ఫాలా
క్షుడ ముక్తికాంత నుపలాలనచేసి సుఖించితే మహా
మోక్షముగద్దు భక్తులకు మూలమునీవె మహానుభావ శ్రీ
దక్షిణ కాళహస్తి మహారుద్రుడ సాంబ॥ 88

నిండుదయాబ్ధి మోక్షజిత నిండుఘట్టాబ్ది హిరణ్యశైల కో
దండ ధరిత్రి భూతిభవ దద్భుత నిర్మలయోగపూరితా
తాండవలింగ నాయెదుట తాండవమాడు వినోదలీల ను
ద్దండముగుల్క జూడవలె దాత నుతాంఘ్రి ముకుందమాధవా
మండిత కాళహస్తి మహారుద్రుడ సాంబ॥ 89

పురహరశంభుమూర్తి శివపూజ మహత్త్వము జూచియాత్మలో
బరువముచేత మాయగను నందెలు మువ్వలు నాడఁజూచియో
వరగురునాకు బిక్షయనివచ్చి నిలంబడి తొల్లి యాత్మలో
సరళిగ మెచ్చి భక్తికి ప్రసన్నము నై ననుజేర్పరా విరా
ట్పురుషుడ కాళహస్తి వృషభేశ్వర సాంబ॥ 90

కాలముదప్పకుండ దశకంధర బంధురవందితత్రిశూ
లాలను బూజచేసి నిటలాక్షుని నేను భజింతునయ్య నో
మూలవిరాట్ట సద్గురుడ ముద్దులతండ్రి శశాంకమౌళి నా
పాలిటిలింగమూర్తి విరుపాక్షుడ దైత్యమదాపహార భూ
పాలక కాళహస్తి మహారుద్రుడ సాంబ॥ 91

నిత్యమురుద్ర మంత్రతపనిష్ఠ తపోబలమోక్షసిద్ధుడై
సత్యగుణాభిరామ నిను సన్నుతిజేయ ననేకకోటి బ
హ్మత్యలు పాఱిపోను మదహస్త ముఖోద్భవయేదివేళ నీ
సత్యము సర్వమోక్ష సిరి సంపదలిచ్చును మాకు మందరా
కృత్యము కాళహస్తి మహారుద్రుడ సాంబ॥ 92

ఈశ్వరశంభుమూర్తి జగదీశ్వర కావవె యప్రమేయ కా
మేశ్వర సాంబమూర్తి పరమేశ్వర శాంత దయాబ్ధిదేవ నం
దీశ్వర లింగమూర్తి వసుధేశ్వర భక్తసుధామయాకర నా
రీశ్వర కాళహస్తి వృషభేశ్వర సాంబ॥ 93

నాయెడ ప్రేమగల్గి శివనామ సుధామృత మంత్ర వేద
పారాయణ మాకుభోజనము రాజితసద్గుణ నిత్య సత్యమే
యాయువుగాన ధర్మములు నక్షయమైన ధనంబుమాకు నా
దాయము రుద్రమూర్తి భవదంఘ్రులసమ్మతి భక్తజీవనో
పాయము కాళహస్తి పరమాత్ముడ సాంబ॥ 94

మంత్రము మంత్రమందురు సప్తమునీంద్రుల సప్తకోటియా
మంత్రములెల్ల పామరులు మాయజపాలను జేయునట్టి దీ
తంత్రముగాక యన్నియును మంత్రములంచు జపింపవచ్చునా
యంత్రము కాళహస్తి యతివందిత సాంబ॥ 95

నిన్నుదలంతు నన్ను గరుణింపుమటంచు దలంచియాత్మలో
నెన్నటికైన బ్రాప్తమున నీశ్వరరూపము జూడగల్గునో
కన్నుల కాంక్షదీర శరకకంఠుడ నామము శబ్దవాక్యముల్
విన్న ఫలంబుగల్గునని వేదము లెప్పుడు నార్భటించుచున్
నున్నవి కాళహస్తి వృషభేశ్వర సాంబ॥ 96

మేలుగ నాదమూర్తి పరమేశ్వర నామసుధారసంబుగా
నాలుకమీద యెన్నటికి గల్గునో నాడును నేను జన్మజ
న్మాల దరింపుచుందునని మానసమందు నుతింతు భక్తవా
చాలకమైన రుద్రుని ప్రసంగము నెప్పుడు నోటనూరితే
చాలును కాళహస్తి సకలేశ్వర సాంబ॥ 97

క్షితినుత పద్మగర్భ మునిసిద్ధగణంబులు జన్మభూమి దే
వతలకు స్వర్గలోకమున నంబుధి రాసులమీది మేదినీ
పతులకు పార్శ్వవేది శివభక్తి మహాత్ముల కోరికందనా
పతులకు గండక క్షేత్ర జపాంత కృతార్థుల జ్ఞానబోధ స
న్నుతునకు కాళహస్తి పరమాత్ముడ సాంబ॥ 98

క్షమధర కౌస్తుభామణి సుగంధగజద్విపపారిభద్రనా
గమునకు రక్ష రేకుక్షమకాస శిరోమణి చుక్కబొట్టు వే
దములకు పట్టుకొమ్మ రిపుదానవ తస్కర రుద్రభూమి పా
పములకు హోమకుండము శుభాస్కర పాత్రులకన్న పూర్ణ క్షే
త్రములకు కాళహస్తి పరమాత్ముడ సాంబ॥ 99

ప్రాణము నమ్మరాదు యిక ప్రాపుగ నమ్మి ఘటంబులోన నీ
ప్రాణము లుండగానే నిను బ్రార్థనజేసి భజింపరాద యా
ప్రాణము నిత్యమైతనదు ప్రాణము జూచిన బుద్ధి వెంటనే
ప్రాణము గానరాదు వుపకారము యొక్కటివచ్చు తోడుగా
ప్రాణికి కాళహస్తి నిటలాక్షుడ సాంబ॥ 100

పాండుకళాధురీణు డెడబాయక సర్వజగత్కిరీటివే
దండడడాండడాండ డడడాండ యటంచు నుతించు నిన్ను నే
తాండవ మూర్తి సర్వభవతారక బ్రహ్మ పిపీలికాది బ
హ్మాండమునిండ నిండుకొని యద్భుతమైన మహాస్వరూపమై
యుండవె కాళహస్తి జగదీశ్వర సాంబ॥ 101

పండిత పామరుల్సకల పాపవిమోచన తండదండనో
ద్దండభవాండ మండిత పథాండనఖండల మండలాద్రి కో
దండ ప్రచండ పిండ భవదండ లఖండిత కుండపాండు రా
పాండవ వీరరుద్ర పరిమండితభార్గవ పాండవాగ్ని రు
ద్రాండజ కాళహస్తి మహారుద్రుడ సాంబ॥ 102

కుంభిని సర్వదేవతల గోరిన నేమి ఫలంబు వారికిన్
శంభుడె తల్లిదండ్రి గురు శంభుడె దిక్కు జగత్తుకెల్ల నా
శంభుడె రక్షకర్తయని సంతతమున్ స్మరియింతు నే జయ
స్తంభము వేసి నాయెదను సాహస కార్యపరాక్రమ విక్రమో
జ్జృంభణ కాళహస్తి శశిశేఖర సాంబ॥ 103

వారధిగట్టవచ్చు భగవంతుని కన్నుల జూడవచ్చు వ్యా
పారము సేయవచ్చు బడబాగ్ని కణంబుల మ్రింగవచ్చు నా
తారముతెత్తవచ్చు యమదండన హింసకు దాళవచ్చు సం
సారము నీదరాదు హరిసాక్షిగ నాకొక త్రోవజూపవే
ధారుణి కాళహస్తి ధరణీశ్వర సాంబ॥ 104

అమర గణార్చితాతమకు నాశ్రితులైన యనేక భక్తులన్
శ్రమలెడబాప గల్గున భృశంబుగ గజ్జెల మ్రోత పెట్టగా
భ్రమమున నందివాహనముపైన నిలంబడి భక్తులిండ్లలో
ధిమిధిమి నాట్యమాడుచును దీనుల బ్రోవవె మోక్షమిచ్చి సం
భ్రమముగ కాళహస్తి నిటలాక్షుడ సాంబ॥ 105

నిన్ శరణన్న వానికి కరుణింతువు చక్కగ మెచ్చి యర్ధనా
రీశ్వర నిన్ను యిప్పుడెదిరించి వారి సమస్తలోక సం
క్షోభవిపక్షు భీష్మాసుర క్రూర దృఢాంచితవజ్ర దైత్యవ
వ్రాళితా పితామహుల చాటునబోయిన సంస్మరించునా
చూచితె కాళహస్తి శివసుందర సాంబ॥ 106

శంకలుదీర్చి భక్తుల నిజంబుగ బ్రోతువటంచు బల్కితే
బొంకవు యాడితప్పవు నబద్ధములాడవు ముక్తిలేని ని
శ్శంక పరీతఖండ హరమాగతా మోహరి బొయకుండుటన్
జంకుదువా శివార్చకుల చెంతకు దూతల జేరనిత్తువా
శంకర కాళహస్తి నిటలాక్షుడ సాంబశివా మహాప్రభో॥ 107

